# కమ్యూనిస్టులతో—

కారల్ మార్క్స

అనువాదకులు:

రామమోహన్.



జనవరి 1939



విశ్వసాహిత్యమాల,

ముంగండ. (Via) అంబాజీపేట.

# Address to the Communist League.

మార్చి 1850

కమ్యూనిస్టులతో—

జనవరి 1939.

యు. షా౯. ప్రింటింగువర్క్సు, సత్తారామేశ్వరము.

వెల రు ౦—౧—౦.

# ప్రాతిపదిక.

కమ్యూనిస్టులీగుకి మార్క్సు ఇచ్చిన ఈవుపన్యాసం శాశ్వతోపయోగంగల ఉత్తమరచనలలో వొకటి. ఇది వ్రాయబడి ఇంచుమించు తొంభైఏళ్లు జరిగినా దీనిలో, నిరూపించబడిన వేరువేరు వర్గస్వభావాలు, యుక్తిప్రయుక్తలూ నేడుకూడా ప్రతిదేశంలోనూ తెలిసేలాగ, తెలియబడకుండానూ కూడా విప్లవోద్యమాన్ని ఎదుర్కుంటూనే వున్నాయి. 1849 లో విప్లవప్రతికూలురు విజయంపొందేక జర్మనీలో బయలుదేరిన ప్రత్యేకపరిస్థితులకి అనుగుణంగా నిరూపించబడినా దీనిలోని ఎత్తుగడలు ప్రపంచవిప్లవోద్యమానికంతటికీ పాఠాలు నేర్పడానికి సరిపడివున్నాయి.

పెట్టీ బూర్జువా డెమాక్రట్లుకూడా అణచివేయబడుతూన్నరోజులలో వారు విప్లవోద్యమంలో ప్రాబల్యం-పలుకుబడి- సంపాదించినప్పుడూ; పోరాటం పూర్తిఅయినాక, వారు తాము సంపాదించిన అధికారాన్నే కార్మికులమీద ప్రయోగించేటప్పుడు; ఈమూడు అవస్థలలోనూ కార్మికవర్గం యొక్క కర్తవ్యాన్నీ- గతివిధుల్నీ గురించి మార్క్సు సూచించిన సూచనలు కేవలం సూత్రమాత్రంగానే వుండవనీ, వాటిని ఆచరణలో పెట్టవచ్చుననీ, ఆచరణలో పెట్టినప్పుడు

కార్మికవర్గానికి విజయం నిశ్చయంగా లభిస్తుందనీ 1917 అక్టోబరులో జరిగిన రష్యావిప్లవం స్పష్టపరిచింది.

పెట్టీ బూర్జువా డెమాక్రాట్లతో ప్రత్యేకవిధమయిన ఐక్యత ఎన్నడూకూడదు. కార్మికులు స్వతంత్రంగా సంఘ నిర్మాణం చేసుకోవాలి. కూలీలు సాయుధులుకావాలి. కార్మికరక్షణదళాలు స్వతంత్రంగా ఏర్పడాలి- అధికారంలో వున్న డెమాక్రట్లరాజ్యాంగవిధానంతో సరిసమానంగా కార్మికవర్గం తన సమితులఅధికారాన్నికూడా స్థాపించి, ద్వంద్వ ప్రభుత్వం ఏర్పరచి, "కార్మికజనసామాన్యంయొక్క బలం సంపాదించిన ఒకశక్తిచేత అడుగడుగుకీ అనుమానదృష్టితో చూడబడుతూ, బెదిరించబడుతూన్నట్లుగా" ఆప్రభుత్వానికి తోపచేయాలి- కూలీలని నిరాయుధుల్ని చేసే ప్రయత్నాలని సాయుధంగానైనా నిరోధించాలి- డెమాక్రట్ల సూచనలని అనుసరించి శ్రామికులు తమకోరికలని నిర్ణయించుతూ వారు విప్లవమధ్యంలో ఆగిపోకుండా సాధ్యమయినంతవరకూ ముందుకి నెట్టుకొనిపోతూ, వీలు చిక్కినంతవరకు బూర్జువాలు అభిమానించే వ్యక్తిగత ఆస్తివిధానాన్ని వారిచేతనే విధ్వంసకమార్గాలలోకి ఈడ్పించాలి. బూర్జువా డెమాక్రట్ల పరిపాలన కొద్దిరోజులపాటయినా తప్పనిసరిగనక ఆ వున్న నాలుగురోజులూ తమతో అనువర్తనగా వుండని పరిస్థితులు కలిగించాలి. ఈమొదలయిన మార్క్సు సూచన

లని బోల్షివిక్కులు ఆచరణలో పెట్టడంచేతనే రష్యా విప్లవం విజయవంతంగా ముగిసిందని ఆచరిత్ర చదివినవారందరికీ స్పష్టమే.

మార్క్సు సూచించిన ఈసూచనలు ఒక్క ఐరోపాకి మాత్రమే చెంది పూరుకోవు. వానికి ప్రపంచవరివ్యాప్తమైన ప్రాముఖ్యతవుంది. బూర్జువాలు- పెట్టీబూర్జువాలు విప్లవోద్యమంలో తొక్కేపద్ధతులనిగూర్చిన మార్క్సు సూచనలు స్వతంత్రదేశాలలో ప్రత్యక్షంగా చూస్తూన్నాము పరాధీనదేశాలయిన భారతదేశం వగయిరా చోట్లనూ- పరాధీనతుల్యాలయిన చైనా వగైరా దేశాలలోనూ వాటిని సూచనమాత్రంగా అనుభవిస్తూన్నాము. ఉభయవర్గాలకీ సామాన్యమైన శత్రువుని ఎదిరించవలసిన పరిస్థితులలో ఉభయులూ తమ లాభాలమాట దూరంగావుంచి ఏకీభావంతో శత్రువుని దెబ్బతీస్తారు. ఈసూచనలోగల సత్యాన్ని మనం మనస్వాతంత్ర్యోద్యమం పొడూగునా అనుభవంలో చూస్తూనేవున్నాము. ఇంతేకాదు. డెమాక్రట్లు తమరినికూడా సోషలిస్టులంటూ చెప్పుకుంటూ- పార్టీ ప్రణాళికని సాధారణ సోషలిస్టు శబ్దజాలంతో తయారుచేసి దానిమాటున తమ వర్గ ప్రయోజనాలని కప్పిపుచ్చి శ్రామికవర్గాన్ని మోసపుచ్చి తమతో చేర్చుకోవడానికి ప్రయత్నించుతారు- నిజానికి కార్మికులవిషయంలో వారు పూర్వపు దీనహీనస్థితిలో వుండ

డాన్నే అభిలషిస్తారు. తమకోరికలని శాసనానుకూలపద్ధతుల ద్వారా సాధించడానికి అవకాశాలుగలచోట్లలో తమ శబ్దాడంబరాన్ని మూలకినెట్టి తమతో కలుపుకున్న శ్రామికవర్గానికి ద్రోహంచేయడంలో ఏమాత్రమూ జంకరు. శ్రామిక వర్గం స్వతంత్రంగా సంఘబద్ధం కావడానికిగాని, స్వతంత్ర కార్యాచరణకి దిగడాన్నిగాని వారు సహించరు. ఏమాత్రపు అవకాశం చిక్కినా అటువంటి స్వతంత్రకార్యాచరణ విధానాన్ని దేశద్రోహకరంఅని తిట్టడంలోగాని, అణచివేయడంలో గాని వెనుకాడరు. స్వతంత్రంగా సంఘాలు ఏర్పరచుకొన్న కార్మికుల్ని సోషలిస్టులూ- రెడ్సూ- అంటూ ఖండిస్తారు. బూర్జువాల కార్యపద్ధతి అంటూ మార్క్సు చెప్పిన ఈవర్గ స్వభావాన్ని మనదేశంలో మనం నిత్యమూ ప్రత్యక్షంగానో- సూచనామాత్రంగానో అనుభవిస్తూన్నాము. మన నాయకులలో ఎందరో తమరిని సోషలిస్టులంటూ చెప్పుకుంటూ సోషలిస్టు కార్యవిధానాన్నీ- కార్మికోద్యమప్రత్యేకతనీ తిట్టి దుమ్మెత్తిపోయడం, వీలుచిక్కినచోట్ల నిర్బంధాలతో అణచివేయడం, మనం చూస్తూన్నాం, కాదు అనుభవిస్తూన్నాం. నిజానికి మనదేశంలో ఇంకా బూర్జువావిప్లవం పూర్తికాలేదు. శ్రామికులతో బూర్జువావర్గం పోరాటం పెట్టుకోవలసిన స్థితి కూడా రా లేదు. ఈవ్యాసంనాటికి జర్మనీలోనున్న పరిస్థితులుగాని, 1917 లో రష్యాలోగల పరిస్థితులుగాని మనకు

లేవు. కాని, ఆ వర్గస్వభావం ఎక్కడికి పోతుంది? అదే జర్మనీ, రష్యాల అనుభవాన్ని జ్ఞాపకానికి తెస్తూంది. కర్తవ్యం విషయంలో మార్గం సూచిస్తూంది. జమీందారీపద్ధతి యొక్క శేషభాగాలతో నీరసించి, అభివృద్ధి పొందుతూన్న పెట్టుబడిదారీ తత్త్వానికీ, విదేశీయ సామ్రాజ్యవాద విధానానికీ మధ్య యుద్ధరంగంగా తయారయిన ఈ మన దేశంలో విప్లవోద్యమంలో పాల్గొంటూన్న పరస్పరవిరుద్ధము లయిన వివిధవర్గాల మధ్యగల పరస్పరప్రయోజనాల పోటీలో, ఏయే సమయాల నేయే వర్గాలని కూడగట్టుకొని, ఏయే యుక్తులతో విదేశీయసామ్రాజ్యవాదవిధానాన్నీ, తరువాత దేశీయ బూర్జువా అధికారాన్నీ, నెమ్మదిగా తప్పించుకొని భారతీయశ్రామికవర్గం తమ అంతిమవిజయాన్ని సాధించుకో గలదో తెలుసుకోనేటందుకు, తెలుసుకొని వర్గచైతన్యం పొంది కార్యాచరణకి దిగేటందుకు, ఈ మాదిరి గ్రంథాల వుపయోగం మనకి చాలావుంది. మన దేశపరిస్థితుల్ని పట్టి ఈ గ్రంథంలో నిరూపించిన గతివిధానం మనని అప్పుడే ఎదురుకోక పోవచ్చును. కాని, ఈ గ్రంథం నుంచి మనం నేర్చుకోవలసిన పాఠాలు లేకపోలేదు.

"శాంతి, భద్రతల కోసం కార్మికులు తమ కోరికలని స్పష్టంగా బయటపెట్టడం మంచిది కాదు......అన్ని చోట్లా కూలీలు ప్రతిపాదించవలసిన కోరికలు డెమాక్రాట్లు

సూచించే కార్యప్రణాళిక మీదా, సౌకర్యాల మీదా ఆధారపడి వుంటాయి......‘ శాశ్వతవిప్లవం ’ అనేదే వారి యుద్ధనినాదం కావాలి ! ”

మార్క్సు యొక్క ఈ సూచనలలో ఎంత ఔచిత్యం వుందో విప్లవోద్యమంలో పాల్గొంటూన్న ప్రతి సోషలిస్టూ గుర్తించగలడు.

నేడు భారతీయ బూర్జువా వర్గం—“ విజయవంతంగా ముగిసిన ప్రతి చిన్నపోరాటానికీ పర్యవసానంగా కలిగే నూతనపరిస్థితులు చూడడం వలన ”, కలిగిన ఉద్రేకంలో బ్రిటిషు సామ్రాజ్యవాదవిధానాన్ని కూలద్రోయడం కోసం ఇంకా కార్మికులమీద ఆధారపడక తప్పని ఈ స్థితిలో కూడా తన వర్గప్రయోజనాల రక్షణ అవసరం అనే భ్రమతో శ్రామికవర్గంయొక్క స్వతంత్రకార్యాచరణనీ, ఆ స్వతంత్ర కార్యాచరణకి మార్గాలు సూచించే విప్లవవాఙ్మయాన్నీ అణిచివేసి, సామ్రాజ్యవాదులకి బలం చేకూరుస్తూంది. బ్రిటిషు సామ్రాజ్యవాదులు భారతీయ జాతీయవాదుల చేతనే వారి జాతీయోద్యమం గొంతు నులిమివేయిస్తున్నారు. ఇప్పుడు మనం ఏమిచేయాలి ?......

ముంగండ,
1 జనవరి ’39

అనువాదకుడు
రామమోహన్

# కమ్యూనిస్టులతో

## (కారల్ మార్క్స)

సోదరులారా !

1848-49 సంవత్సరాలు రెండూ కేవలం విప్లవాల మధ్య గడిచిపోయినాయి. ఈ రెండేళ్లలోనూ ప్రతి దేశం లోనూ కూడా కమ్యూనిస్టు లీగు సభ్యులు విప్లవోద్యమాన్ని అతిసామర్థ్యంతో నిర్వహించేరు. పత్రికా ప్రచారంలో నైతే నేమి, రక్షకస్థానాలు కట్టుకోవడంలోనూ, యుద్ధరంగాలలోనూ అయితేనేమి, వీరు ఒకేఒక విప్లవకరవర్గమైన శ్రామికులకి ముందు నిలబడి పోరాడేరు. కమ్యూనిస్టు లీగు పై రెండు పరీక్షలకీ కూడా నిలచింది. 'లీగు' మహాసభ, సెంట్రలు కమిటీలు కలిసి 1847 లో ప్రకటించిన సర్క్యులరులోని కమ్యూనిస్టుల ప్రణాళికలో నిరూపించిన ఉద్యమ స్వభావజ్ఞానము 'లీగు' యొక్క గొప్పదనాన్ని మరింత స్పష్టపరిచింది. ఆ పత్రంలోని సూచనలన్నీ కార్యరూపం ధరించడంచేత ఆ మార్గమే సరియైన దని ధృవపడింది. ఈ నాటి సామాజికసంబంధాల విషయంలో దానిలో ప్రకటించబడిన అభిప్రాయాలు (వీనిని ఇదివరకు లీగు మాత్రమే

రహస్యంగా ప్రచారం చేస్తూండేది.) నేడు ప్రతిదేశంలోనూ బోధించబడుతూన్నాయి. బహిరంగసమావేశాలలో ప్రచారం చేయబడుతూన్నాయి కాని, ఇదే సమయంలో అంతకు పూర్వం చాలా దృఢంగా వున్న 'లీగు' నిర్మాణం పూర్తిగా శిథిలమైపోయింది. విప్లవోద్యమంలో ప్రత్యక్షంగా పాల్గొన్న 'లీగు' సభ్యులలో చాలామంది రహస్యసంఘాల అవసరం తీరిపోయిందనీ, బహిరంగమైన ప్రజోద్యమం ఒక్కటీ చాలుననీ, అభిప్రాయపడుతూన్నారు. లీగు కేంద్రాలు, అభిమానుల సంఘాలు, సెంట్రలు కమిటీతో తమ కున్న సంబంధాలు తగ్గించుకోవడం మూలాన, ఆ సంబంధాలు ఇంచుమించుగా తెగిపోయినా యనే చెప్పవచ్చును.

పెట్టీ బూర్జువా పక్షం అయిన డెమాక్రటిక్ పార్టీ క్రమక్రమంగా జర్మనీలో బలంకూర్చుకొని స్థిరపడుతూంటే కార్మికపక్షం బలీయమైన ఆధారాన్నొక్కదానినీ పోగొట్టుకుంది. ఆ పక్షం నేడు ఏవో కొన్నిప్రదేశాలలో స్థానికసమస్యలు పరిష్కరించుకొనేదిగా మాత్రం మిగిలివూరుకుంది. అందుచేతనే అది ప్రజోద్యమం వచ్చేటప్పటికి పెట్టీ బూర్జువా డెమాక్రాట్ల అధికారానికి లోబడి వారు చెప్పినట్లల్లా వినవలసివచ్చింది. ఈ పరిస్థితుల్ని ఇంతతో ఆఖరు చేసేయాలి. కార్మికులలో స్వతంత్రంగా తమ కార్యాలు నిర్వహించుకోగల శక్తి కలిగించాలి. సెంట్రల్ కమిటీ ఈ యావ

శ్యకతని గుర్తించింది. గుర్తించి వెంటనే 1848-49 సంవత్స రపు శీతాకాలంలో లీగు శాఖని పునర్నిర్మాణం చేయడం కోసం 'జోసెఫ్ మోల్' అనే ప్రతినిధిని జర్మనీకి పంపించింది. కాని, మోల్ యొక్క రాయబారం వలన చెప్పతగ్గ ఫలితాలేవీ కలగలేదు. జర్మనీలోని కూలీలకి తగినంత అనుభవం లేకపోవడం కొంతవరకూనూ, మే నెలలో జరిగిన విప్లవం రాయబారాలకి అభ్యంతరం కాడం కొంతవర కూనూ, ఈ ఫలితం లేకపోవడానికి కారణాలు. 'మోల్' స్వయంగా ఆయుధం చేతపట్టి, 'బేడెన్-ప్లాజు' సేనలతో చేరి, జూలై 19 న 'మూర్గు' వద్ద జరిగిన యుద్ధంలో చనిపోయేడు. 'మోల్' పార్టీ కాంగ్రెసులన్నిటిలోనూ పాల్గొన్నాడు. సెంట్రలు కమిటీ సమావేశా లన్నింటిలోనూ పాల్గొన్నాడు. అటువంటి వ్యక్తి మరణంతో లీగు, విశ్వాసపాత్రుడు, చిరకాలాన్నుంచి పని చేస్తూన్న వాడు, మంచి సమర్థుడు, అయిన సభ్యుణ్ణి పోగొట్టుకుంది. 1849 లో జర్మనీలోను, ఫ్రాన్సులోను గల విప్లవపక్షాలు అప జయం పొందేయి. అటుతర్వాతనే ఇంచుమించు సెంట్రలు కమిటీ సభ్యులంతా నూతనవిప్లవోత్సాహంతో లండనులో మళ్ళీ సమావేశంఅయి, పూర్వంకంటేనూ పట్టుదలతో లీగును మళ్ళీ నిర్మించాలని నిశ్చయించేరు.

ఈ పునర్నిర్మాణం కేవలం రాయబారిద్వారానే

సాధించడానికి వీలుంది. క్రొత్తగా మళ్ళీ విప్లవం వచ్చేస్తూంది. ఈ విప్లవంలో 1848 లో జరిగినట్లుగా కార్మికపక్షం బూర్జువాలచేత ఎటు కావలసివస్తే అటు ఈడ్వబడుతూ, వారిచేత ఉపయోగించుకోబడనీయ కూడదు. సాధ్యమైనంత వరకు స్వతంత్రంగానూ, సమ్మిళితంగానూ, దృఢంగానూ నిర్మించబడి, కార్మికపక్షం యుద్ధరంగంలో ప్రత్యక్షంకావాలి. ఇంత పని జరగవలసిన ఈ సమయంలో వెంటనే సమర్థుడైన రాయబారిని వొకణ్ణి పంపించి తీరాలని సెంట్రల్ కమిటీ నిర్ణయించుకుంది.

సోదరులారా !— జర్మనీలోని బూర్జువా ఉదారవాదులు త్వరలోనే అధికారంలోకి వస్తారనీ, వచ్చిన వెంటనే తాము నూతనంగా సంపాదించిన ఆ యధికారాన్ని కార్మికుల మీదనే ప్రయోగిస్తారనీ, మేము 1848 లోనే చెప్పేము. ఈ భవిష్యకథనం ఏవిధంగా కార్యరూపం ధరించిందో మీరే చూసేరు. నిజంచెప్పాలంటే, 1848 మార్చిలో వచ్చిన ఉద్యమం తరువాత రాజ్యాంగాధికారాన్ని స్వీకరించిన బూర్జువావర్గమే, అంతవరకూ తనకి సహాయులుగావున్న కార్మికులని వారి పూర్వపు పీడితావస్థలోకి నెట్టివేయడానికి ఆ రాజ్యాంగాధికారాన్ని ప్రయోగించింది. అప్పటికప్పుడే విప్లవోద్యమం శాంతియుతమైన అభివృద్ధి మార్గంలో సాగుతూంది. బూర్జువావర్గం మార్చినెలలో తాను కూలద్రోసిన

జమీందారీపక్షంతో చేయికలిపి, ఆఖరుకి నిరంకుశమైన జమీందారీ పక్ష ప్రభుత్వానికి లొంగిపోయి, కార్మికులకి ద్రోహం తలపెట్టకపోయివున్నప్పటికీ, ఆనాటికి ప్రభుత్వానికిగల ఆర్థికపరిస్థితులు కారణంగా రాజ్యాంగాధికారాన్ని చాలా కాలంవరకూ తనచేతులలోనే వుంచుకోగలిగివుండేది. వారి ప్రయోజనాలకి భంగమూ వుండేదికాదు. తన అధికారాన్ని స్థిరపరుచుకుందుకై బూర్జువావర్గం క్రూరవిధానాన్ని అవలంబించి ప్రజల అసహ్యానికి పాల్పడవలసిన అగత్యమే వుండేది కాదు. ఏమంటే, అభివృద్ధినిరోధకమయిన జమీందారీ పక్షమే ప్రజలమీద ఈక్రూరవిధానాలన్నీ వుపయోగించి చూసింది. కాని, ఉద్యమం ఈవిధంగా శాంతి మార్గాలలో నడవడంలేదు. పైపెచ్చు దానిగమనాన్ని శీఘ్రతరంచేయగల విప్లవం త్వరలోనే రాబోతూంది. ఫ్రెంచిశ్రామికవర్గం స్వతంత్రంగా తిరుగుబాటు చేయడం చూసికానీయండి, విప్లవకరమయిన ఫ్రెంచి శ్రామికవర్గం మీదికి (హోలీ ఎలయన్సు) ఆస్ట్రియా, ప్రష్యా, రష్యాల సైన్యాలు సమ్మిళితంగా దండెత్తి రావడం చూడడంతోటే కలిగిన ఉద్రేకంవలన కానీయండి, కారణం ఏదయినా విప్లవం త్వరలోనే వచ్చేస్తూంది.

1848 లో ప్రజలకి విరుద్ధంగా జర్మను బూర్జువా ఉదారవాదు లవలంబించిన ఈ ద్రోహవిధానాన్నే, ముందు

ముందు పెట్టీబూర్జువా డెమాక్రాటిక్ పార్టీ అవలంబిస్తుంది. నేడు బూర్జువా ఉదారవాదులకి ప్రతికక్షులుగా వున్న పెట్టీ బూర్జువాలుకూడా, నాడు బూర్జువాలు తొక్కిన మార్గాన్నే భవిష్యద్విప్లవసమయంలో తొక్కుతారు.

కార్మికుల విషయంలో బూర్జువా ఉదారవాదుల కన్నా అధికంగా అపాయం కలగచేయగల ఈ పెట్టీబూర్జువా డెమాక్రాటిక్ పార్టీలో మూడు తరహాల జనం వున్నారు.

1. బూర్జువా వర్గంలోని తీవ్రవాదులు. వీరు జమీందారీ విధానాన్నీ, నిరంకుశత్వాన్నీ, వెంటనే సంపూర్ణంగా నిర్మూలించాలంటారు. సన్నుల విధానానికి వ్యతిరేకులయిన ఈపక్షానికి 'వెరిణ బార్గణ' నాయకుడు.

2. పెట్టీ బూర్జువాలలోని శాసనబద్ధ ప్రజాతంత్రవాదులు (Constitutional Democrats) ప్రజాతంత్ర పద్ధతులమీద నడపబడే 'జర్మను సంయుక్తరాష్ట్రప్రభుత్వం' స్థాపించడమే వీరి ఉద్యమంయొక్క గమ్యం. 'ఫ్రాంకుఫర్టు' అసెంబ్లీలోని అతివాదపక్షమూ, 'ట్గార్టు' అసెంబ్లీలోని అతివాదపక్షమూ, ఈకక్షకి చెందినవారే. ఫెడరల్ రాజ్యాంగ పద్ధతికోసం వీరు ప్రచారంచేస్తున్నారు.

3. పెట్టీ బూర్జువాలలోని రిపబ్లికను పక్షంవారు. స్విట్జర్లండులో మాదిరి 'ఫెడరేటెడ్ రిపబ్లికు' స్థాపించడం వీరి ఆదర్శం. బూర్జువాలు పెట్టీ బూర్జువాలని అణచివేయకూడ

దనే ధార్మిక సిద్ధాంతాన్ని వీరు ప్రతిపాదించేరు. అందు మూలంగానే వీరు తమరిని ' రెడ్స్ ' అనీ, ' సోషల్-డెమా క్రాట్స్' మనీ, చెప్పుకుంటున్నారు. డెమాక్రాటిక్ కాంగ్రెసు సభ్యులు, కమిటీసభ్యులు, డెమాక్రాటిక్ సంస్థల సంచాల కులు, డెమాక్రాటిక్ వార్తాపత్రికల సంపాదకులు, ఈ పక్షానికి చెందినవారే.

' ఫ్రాంక్‌ఫర్టు అస్సెంబ్లీ ' లోని రిపబ్లికను పెట్టీ-బూర్జువాలు తమరిని ' సోషలిస్టు ' లంటూ చెప్పుకుంటూ వున్నట్లే, ఈ పక్షాలన్నీ పరాజయం పొందిన నాటినుంచీ ' రిపబ్లికనుల ' మనీ, ' రెడ్స్ ' మనీ, చెప్పుకుంటూన్నాయి.

కాని, తమ కోరికలని శాసనానుకూలపద్ధతుల ద్వారా సాధించడానికి అవకాశంగల ' వర్టెంబర్గు ' - ' బవేరియా ' మొదలయిన చోట్లలోఅల్లా వారా అవకాశాలు వినియో గించుకుందుకై తమ వెనుకటి శబ్దజాలాన్ని అంతనీ దూరంగా పెట్టి వేస్తూన్నారు. దీనివలన వీరు కార్యాచరణం విషయంలో ఏమాత్రమూ మార్పు పొందివుండలేదని తేలిపోయింది. వీరు మార్చుకున్నంత మాత్రాన కార్మికుల యెడల వీరి దృక్పథం ఎంత మాత్రమూ మారలేదనీ, కేవలం బూర్జువా లని ఎదిరించక తప్పనిసరి వచ్చినప్పుడే, తమ లాభంకోసం పెద్ద కభుర్లతో కార్మికులదగ్గిరికి చేరుతూంటారనీ తేలి పోతూంది.

జర్మనీలో పెట్టీ-బూర్జువా డెమాక్రాటిక్ పార్టీ చాలా బలంగావుంది. పట్టణాలలోని మధ్యతరగతి ప్రజా సమూహంలో అధికసంఖ్యాకులు ఈ పార్టీలోనివారే. చిన్న చిన్న పరిశ్రమలవారు, చిన్నవర్తకులు, మాత్రమేగాక రైతులు కూడా వారితోటే చేరేరు. పట్టణాలలోని స్వతంత్రులయిన కార్మికపక్షాలసహాయం లభించేటంతవరకూ వ్యవసాయపు కూలీలుకూడా రైతులతోపాటుగా వారితోటే చేరుతారు.

బూర్జువాలతో పోరాడేటందుకై, పరిసితుల ప్రాబల్యంచేత కార్మికపక్షం పెట్టీ బూర్జువా డెమాక్రాట్లతో చేతులు కలుపుతుంది. అయినా, పెట్టీ బూర్జువావర్గం తన ప్రయోజనాలని స్థిరపరుచుకుందుకు చేసే ప్రతిప్రయత్నాన్నీ అది ఎదిరిస్తుంది.

కార్మికుల ప్రయోజనాలకోసం డెమాక్రాటిక్ పెట్టీ బూర్జువావర్గం సాంఘికవిధానాన్ని అంతనీ మారుస్తుందనే మాట వట్టి అబద్ధం. తనమట్టుకి తనకి సౌఖ్యంగానూ, అనుకూలంగానూ, వుండేటట్లుగా సాంఘికపరిస్థితులలో మార్పులు కలిగించడానికి మాత్రం ప్రయత్నిస్తుంది. మొట్టమొదట, వారు ప్రభుత్వవ్యయాన్ని తగ్గించడానికి పూనుకుంటారు. ఆ ప్రయత్నంలో ఉద్యోగీయవర్గం మీద నిర్బంధాలు వుపయోగిస్తారు. పెద్దభూస్వాములమీదా, బూర్జువాలమీదా, పెద్దపెద్ద పన్నులు వేస్తారు. పెద్ద పెట్టు

బడిదారులు చిన్న పెట్టుబడిదారుల మీద తెచ్చే ఒత్తిడిని తొలగించడం కూడ వారి వ్యూహాలలో ఒకటి. దీనికోసమై ప్రభుత్వమే పరపతిసంఘాలు స్థాపిస్తుంది. వడ్డీషాహుకారులకి విరుద్ధంగా చట్టాలు చేస్తారు. ఆ చట్టాల సహాయంతో పెద్ద పెట్టుబడిదార్ల వద్ద కంటె అనుకూలంగావుండే షరతుల మీద తమకీ, రైతులకీ, ఋణాలు దొరికేటట్లు చేసుకుంటారు. జమీందారీవిధానాన్ని తొలగించి, భూములకికూడా బూర్జువా ఆస్తిసాంప్రదాయాలు సంక్రమింపచేయడం వారి ఉద్దేశ్యాలలో ఇంకొకటి. ఇవన్నీ పూర్తిగా కొనసాగించడం కోసం వారు ప్రజాతంత్రపద్ధతి, అందులోనూ, శాసనబద్ధ ప్రజాతంత్ర ప్రభుత్వం కావాలంటారు. ఆ ప్రభుత్వంలోనే, వారికీ, వారి స్నేహితులయిన రైతులకీ, ఎక్కువ స్థానాలు లభించేటందుకు అవకాశాలు వున్నాయి. ఇంతే కాదు. దీనితోపాటు మునిసిపాలిటీల్లో కూడా ప్రజాతంత్రవిధానం అవలంబిస్తారు. దీనివలన అంతవరకూ ఉద్యోగీయవర్గం (Bureaucrats) చేతుల్లో నడిపించబడుతూన్న రాజకీయసంస్థలు ఎన్నో వీరి స్వాధీనం అవుతాయి. మునిసిపాలిటీల ఆస్తులమీద కూడా వీరికే అధికారం వుంటుంది.

నిర్బంధాలు కలిగించడం ద్వారానూ, ప్రజాసౌఖ్యానికి ఉపయోగించే పనుల్లో సాధ్యమైనన్ని ఎక్కువవాటిని ప్రభుత్వం చేతిలోనికి తెచ్చుకొనడం మూలంగానూ, వారు

పెట్టుబడిదారుల అధికారాన్నీ, శీఘ్రాభివృద్ధినీ నిరోధిస్తారు. కార్మికుల విషయంలో, వారు పూర్వపు హీనస్థితిలో వుండడమే వీరి వుద్దేశం. కాని, ఒక్కటి. పెట్టీ-బూర్జువా డెమాక్రాట్లు కూలీలకి మంచిజీతాలు వుండాలనీ, మంచి సౌకర్యాలు కలిగించాలనీ, కోరుతారు. ప్రభుత్వంద్వారా కూలీలకి తాత్కాలికంగా పనులు కలిగించీ, కార్మిక శ్రేయోవిధానాలని (Welfare Measures) అవలంబించీ ఈ పని సాగించుతారు. అంటే కనపడని, తెలియని, విధంగా కూలీలకి లంచాలు ఇచ్చి, తాత్కాలికంగా వారి బాధలకి విరుగుడు కలగచేసీ, వారిలోని విప్లవోత్సాహాన్ని ధ్వంసం చేయడానికి ప్రయత్నించుతారు. ఈ పైన పెట్టీ-బూర్జువా డెమాక్రాట్ల అభిప్రాయాలంటూ చెప్పిన విషయాలన్నీ ఆ పార్టీలో వివిధపక్షాల వారు కలిసి ఏకాభిప్రాయానికి వచ్చి నిర్ణయించుకున్నవి కావు. మొత్తంమీద తీసుకుంటే పెట్టీ-బూర్జువా డెమాక్రాట్లలో కొద్దిమంది గమ్యం మాత్రం అదే. వారిలో చాలమంది వ్యక్తులూ, పక్షాలూ కోరేవి ఇంతకంటె తీవ్రంగా వుంటాయి. అలాంటప్పుడు పైన చెప్పినవి ఆయా పక్షాల కోరికల్లో కొంతభాగం మాత్రమే అవుతాయి. పైవానిలోనే తమ కార్యక్రమం అంతా ఇమిడి పోయిందని తలచే కొంతమందికి పైన చెప్పినవే చాలా తీవ్రంగా కనపడి, విప్లవం వలన మానవుడు సాధించతగిన

పరమార్థం ఇంతకంటేనూ ఏముంది? అనిపిస్తాయి. కాని, ఈ కోరికలు ఏవీ కార్మికుడిని సంతృప్తిపరచలేవు.

పైన చెప్పిన వాట్లలో చాలావరకు సాధించినాక, సాధ్యమైనంత త్వరలో విప్లవాన్ని ముగింపచేయడానికి పెట్టీ బూర్జువా డెమాక్రాట్లు వాంఛిస్తారు. ఆ సమయంలో మన ప్రయోజనాలకోసం విప్లవాన్ని శాశ్వతంగా సాగించేటట్లు చూడడం మన విధి. కలవాళ్ల ఆస్తులన్నీ ఇంచుమించుగా లాగివేయబడాలి. ప్రభుత్వాధికారం కార్మికుల చేతులలోనికి రావాలి. ఏదో ఒక్క దేశంలో మాత్రమేగాక, ప్రపంచంలోని ప్రధాన దేశాలన్నింటిలోనూ కూడా కార్మికుల మధ్య గల పోటీలు తొలగించుకుంటూ శ్రామికవర్గం సమ్మేళనం పొందాలి. అధమం ముఖ్యములయిన ఉత్పత్తిసాధనాలయినా కార్మికుల చేతులలోనికి వచ్చేసెయ్యాలి ఆఖరుకి, ఇంత వరకూనైనా విప్లవం సాగించడం మన కర్తవ్యం. ప్రత్యేకాస్తివిధానంయొక్క స్వరూపాన్ని మార్చడం మనపని కాదు. ఆ విధానాన్నే సంపూర్ణంగా ధ్వంస చేయాలి. వర్గాలమధ్య గల భేదాలని అణచిపెట్టడం మన వుద్దేశంకాదు. అసలు వర్గాలనే తొలగించివేయాలి. ప్రస్తుత సాంఘిక విధానాన్ని సంస్కరించడం మన ఆశయంకాదు. మనం నూతన సమాజాన్ని నిర్మించవలసిందే. ఏది ఏలాగవున్నా, ఈ వేళ, విప్లవం పెంపొందుతూన ఈ సమయంలో, జర్మనీలో పెట్టీ బూర్జువా

డెమాక్రాటిక్ విధానానికే ఎక్కువ పరపతివుంది. అందుచేత ఆ విధానంపట్ల కార్మికులూ, లీగూ ఎటువంటి దృక్పథం కలిగియుండాలి, అనే ప్రశ్న రావచ్చును.

1. పెట్టీ-బూర్జువాలు కూడా అణచివేయబడుతూన్న ఈ నాటి పరిస్థితులలో ?—

2. రాబోయే విప్లవపోరాటంలో పెట్టీ బూర్జువా డెమాక్రాట్లు అధికశక్తి సంపాదించిన రోజులలో ?—

3. పోరాటం పూర్తి అయినాక తాము సంపాదించిన పలుకుబడిని తాము అప్పుడే కూలద్రోసిన బూర్జువా వర్గాలమీదా, కార్మిక వర్గంమీదా, ప్రయోగించే రోజులలో ?—

మొదటిదానికి :—ప్రతిచోటా పెట్టీ బూర్జువాలు అణచివేయబడుతూన్న సమయాలలో సాధారణంగా తామే కార్మికులతో స్నేహాన్నీ, కలయికనీ, వాంఛిస్తారు. వారు కార్మిక పక్షంతో చేతులుకలిపి, వివిధకక్షలకి చెందిన అన్ని రకాల ప్రజాతంత్రవాదులనీ కూడ కట్టుకొని, ప్రభుత్వానికి ప్రతికూలంగా పెద్ద పార్టీని లేవదీస్తారు. అంటే తమ పార్టీ కార్యక్రమంలో సర్వసాధారణంగా వినిపించే సోషల్ డెమాక్రాటిక్ శబ్దజాలాన్ని ప్రవేశపెట్టి, దానిమాటున తమవర్గ ప్రయోజనాలని కప్పి పుచ్చుతారు. ఆ శబ్దజాలాన్ని చూపి, తమ పార్టీలోకి కార్మికుల్ని ఆకర్షించడానికి ప్రయత్నిస్తారు.

శాంతి, భద్రతలకోసం కార్మికులు తమ కోరికలని మొదటి నుంచీ స్పష్టంగా బయటపెట్టడం మంచిది కాదనుకోండి. అల్లాగని వారితో చేరిపోకూడదు. అటువంటి ఐక్యత పెట్టీ-బూర్జువాలకి కేవలం లాభదాయకమూ, శ్రామికులకి నష్టదాయకమూ అవుతుంది. శ్రామికులు అంత త్యాగంచేసి సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకుంటారు. శ్రామికవర్గం మళ్ళీ అధోగతిపాలై అధికారంలో వున్న బూర్జువా డెమాక్రాటిక్ విధానానికి ఛాయలాగ తయారై వూరుకుంటుంది.

ఇటువంటి ఐక్యతని చాలా నిర్మొగమాటంగా ఖండించేయాలి. బూర్జువా డెమాక్రాట్లకి వెనకాల హంగు చేయడంకి మాత్రమే ఉపయోగించేటట్లుగా గాక, అధికారంలో వున్న డెమాక్రాట్లతో ప్రమేయంలేకుండా కార్మికులు (ముఖ్యంగా ' లీగు ') రహస్యంగానూ, బహిరంగంగానూ కూడా తమ సంఘాలని స్వతంత్రంగా నిర్మించుకొనడానికి పాటుపడాలి. ప్రతి మునిసిపాలిటీలోనూ కార్మిక కేంద్రం, కార్మికపక్షం యొక్క ప్రాథమికసంఘం ఏర్పరచబడాలి. వానిలో బూర్జువాలతో సంబంధంలేకుండా కార్మికుల పరిస్థితులు, వారి లాభనష్టాలు, చర్చించబడుతూవుండాలి.

బూర్జువా డెమాక్రాట్లు ఈ సమ్మేళనాన్ని ఎంత మంచిమనసుతో కోరుతూన్నారో తెలుసుకోవాలంటే

బ్రెస్లా డెమాక్రాట్ల వైపు చూడండి. వారు తమ పార్టీ పత్రికయైన Neue Oder Zeitung లో స్వతంత్రంగా సంఘాలు ఏర్పరచుకొన్న శ్రామికులకి విరుద్ధంగా వ్రాస్తూ, ఎంతో దురుసుతనంగా వారిని 'సోషలిస్టు' లంటూ ఖండించేరు.

ఉభయవర్గాలకీ సామాన్యుడే అయిన శత్రువుతో పోరాడవలసిన పరిస్థితుల్లో ప్రత్యేకవిధమైన సమ్మేళనం అనవసరం. అటువంటి శత్రువుని బహిరంగంగా ఎదిరించవలసిన సమయం రాగానే, తాత్కాలికంగా ఉభయపక్షాలవారూ తమతమ లాభాల విషయం వదులుకుంటారు. వెనకటి రోజుల్లో ఇలాగే జరిగింది. భవిష్యత్తులో కూడా ఈ విధంగానే ఈ తాత్కాలికసంబంధాలు ఏర్పడతాయి. వెనుకటి రోజుల్లోకి మాదిరిగానే ముందుకూడా రాబోయే సాయుధ పోరాటాల్లో ముఖ్యంగా కార్మికులే తమ పరాక్రమం, తెగతెంపు, స్వార్థత్యాగం, మూలకంగా విజయాన్ని సాధిస్తా రనే సంగతి అందరూ ఎరిగినదే. సాధ్యమైనంత ఎక్కువ కాలం, తటస్థంగా, గోడమీాది పిల్లివాటంగా వుండివుండి, ఆఖరున పెట్టీ-బూర్జువావర్గం, వర్గం అంతా పోరాటంలోకి దూకడానికి త్రొక్కటపడుతుంది. తరువాత, విజయం లభించిన వెంటనే దానిని తాము దఖలు పరుచుకోవడానికి ప్రయత్నిస్తారు. 'శాంతంగా వుండండి' అనీ, 'మీా

పనుల్లోకి మామూలుగా వెళ్ళండి' అనీ, 'దుందుడుకు పనులు ఏవీ చేయవద్దు' అనీ, వాళ్ళు కార్మికులకి బుద్ధులు చెప్పుతారు. వారిని నిలువబెట్టి, తాము ముందుకుపోయి ఆ విజయలాభాన్ని కాస్తా కార్మికులకి దక్కకుండా చేస్తారు. పెట్టీ-బూర్జువావర్గం ఇటువంటి పనులు చేయకుండా నిలవ గలగడం కార్మికవర్గం యొక్క శక్తిమీద ఆధారపడిలేదు. సాయుధులైవున్న కార్మికులకి వ్యతిరేకంగా పెట్టీ బూర్జువాలు తమ అధికారబలాన్ని వుపయోగించలేకుండా చేసే నేర్పు మీదనే అది ఆధారపడి వుంటుంది. బూర్జువా డెమాక్రాట్ల ప్రభుత్వం మొదటినుంచీ తన వినాశబీజాలు తానే తెచ్చు కొనే పరిస్థితులు కల్పించడంమీదనే అది ఆధారపడివుంది. అలాగ చేయగలుగుతేనే, ముందుముందు వారిని తొలగించి ప్రభుత్వాధికారం చేజిక్కించుకొనడంలో కార్మికులకి సులువు చిక్కుతుంది.

పోరాటం జరిగేటప్పుడూ, పూర్తి అయినవెంటనే కూడా, అన్నిటికంటేనూ ముఖ్యంగా పెట్టీ-బూర్జువా డెమాక్రాట్లు ఉపయోగించుతూన్న విప్లవశబ్దజాలాన్ని ఆచరణలోకి తీసుకువచ్చేటట్లుగా వారిమీద ఒత్తిడి తేవాలి. శాంతి కావాలంటూ వారు చేసే హెచ్చరికలని సాధ్యమైనంతవరకు ప్రతిఘటించాలి. హఠాత్తుగా విజృంభించిన డెమాక్రాట్ల విప్లవోద్రేకం, విజయానంతరం వెంటనే చల్లారి

పోకుండేలాగు కార్మికులు జాగ్రత్తపడాలి. పైపెచ్చు ఆపొంగు సాధ్యమైనంత ఎక్కువకాలం నిలబెట్టేటందుకు చూడాలి. అత్యాచారాలంటూ వారు ఘోషించే క్రియలని ఖండించడం మాట ఆలావుంచండి. (పూర్వం తమమీద జరపబడిన దౌర్జన్యాలకి ప్రతిక్రియగా కార్మికులు చేసే తీవ్రప్రతీకారాలు) వాటిని అసలు లెక్కచేయనే కూడదు; సరికదా, పైపెచ్చు వాటిని తమ చేతుల్లోనికే తీసుకొని సరియైన పద్ధతుల్లో తామే జరిపించడం అవసరం.

పోరాటం జరుగుతూన్నప్పుడూ, పూర్తి అయిపోయినాకా కూడా కార్మికులు వీలు చిక్కినప్పుడల్లా బూర్జువా డెమాక్రాట్ల కోరికలకీ, తమ కోరికలకీ గల భేదాన్ని స్పష్ట పరుస్తూ ప్రకటనలు చేస్తూండాలి. బూర్జువా డెమాక్రాట్లు ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకొనడానికి తయారుకాగానే కార్మికులు తమ వర్గరక్షణాలు కోరాలి. ఒకవేళ అవసరం అయితే ఈ రక్షణలని బలాత్కారంగానైనా సంపాదించి తీరాలి. ఈ నూతనపరిపాలకులని ఎన్నో హామీలూ, మినహాయింపులూ తోటి కదలమెదలలేకుండా చేసేయాలి. వారంతట వారే సంధికి దిగేటట్లు ఒత్తిడి తేవడమే సరిఅయిన పద్ధతి. విజయవంతంగా ముగిసిన ప్రతి చిన్నపోరాటానికీ పర్యవసానంగా కలిగే నూతనపరిస్థితులు చూడడంవలన కలిగిన ఉద్రేకాన్నీ, విజయోత్సాహప్రకటనలనీ, సాధ్యమైనంత

వరకూ నిరోధించాలి. నూతనపరిస్థితుల్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించేసి, అన్నివిధాలా కూడా ఈ నూతనప్రభుత్వం మీద తమకుగల అపనమ్మకాన్ని నిర్మొగమాటంగా ప్రకటించాలి. కొత్తగా అధికారంలోకి వచ్చిన ఈ ప్రభుత్వంతో సరిసమానంగా కార్మికులు తమ విప్లవప్రభుత్వాన్ని, కార్య నిర్వాహకవర్గసమితుల రూపంలోనో, స్థానికసంఘాల పేరిటనో, కార్మికసమితుల, కార్మికసంఘాల, రూపంగానో, దృఢతరంగా నిర్మాణం చేయాలి. అలాగచేస్తే బూర్జువా డెమాక్రాటిక్ ప్రభుత్వానికి కార్మికుల మీద గల పలుకుబడి సన్నగిల్లుతుంది. అంతేకాదు, కార్మికజనసామాన్యం యొక్క బలం సంపా దించిన ఒక శక్తిచేత అడుగడుగులోనూ అనుమానదృష్టితో చూడబడుతూ, బెదిరించబడుతూన్నట్లుగా ఆ నూతనప్రభుత్వం వెంటనే గుర్తించుతుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, జయంపొందిన మరుక్షణంనుంచీ కార్మికుల అనుమానదృష్టి జయించబడిపోయిన అభివృద్ధినిరోధకపక్షాలమీదికి గాక, అంతవరకూ తమతోవుండి అందరూకలిసి సంపాదించిన విజయాన్ని తామొక్కరూ అపహరింప చూస్తూన్న పెట్టీ-బూర్జువా డెమాక్రాట్ల మీదికే ప్రసరించేటట్లు చేయాలి.

రెండోది :— కాని ఈ పెట్టీ-బూర్జువా డెమాక్రాటిక్ పక్షానికి గుండెబెదురు కలిగేటట్లు అతిసమర్థతతో (వీరు విజయం లభించిన మరుక్షణంనుంచే శ్రామికవర్గాన్ని మోస

గించడం ఆరంభించుతారు.) ఎదురించ గలిగేటట్లు చేయా లంటే కూలీలకి ఆయుధాలిచ్చి, మంచి శిక్షణనీయాలి. కార్మికులకి వెంటనే తుపాకులు, రైఫిళ్ళు, ఫిరంగులు, మందుగుండుసామగ్రి ఇచ్చి సాయుధులనుగా చేయాలి. కార్మికులకి వ్యతిరేకంగా ఏనాటిదో అయిన 'సిటిజన్-గార్డ్సు' ను పునరుద్ధరించే యత్నాలని తప్పకుండా ఎదు ర్కోవాలి. ఆలాగ చేయడం సాధ్యంకాని ప్రదేశాలలో ఈ పనిని నిర్వహించడానికి కార్మికులే పూనుకోవాలి. వారు స్వతంత్రంగా కార్మికరక్షకశాఖని ఏర్పాటు చేసుకోవాలి. ఈ శాఖకి నాయకులనీ, ఉద్యోగులనీ, తమలోనుంచే ఎన్ను కోవాలి. ఈ శాఖని ప్రభుత్వం స్వాధీనంలో వుంచక, తమచేతనే నిర్మించబడిన విప్లవకరస్థానికసంఘాలయొక్క (Community Council) అధీనంలో వుంచాలి. ప్రభుత్వము క్రింద పనిచేస్తూన్న కార్మికులు కూడా ఒక సంఘముగా ఏర్పడి, ఆయుధాలతో ప్రత్యేక సైనికదళాలుగా ఏర్పడి, దానికి తమలోనుంచే ఒకనాయకుడిని ఎన్నుకోవాలి. లేదా ఆ దళాన్ని కార్మికరక్షకశాఖలో ఒక భాగంగా చేయాలి. ఏ నెపంమీదా కూడా కూలీలు తమ చేతులలోని ఆయుధాలు, మందుసామగ్రీ స్వాధీనంచేసుకో నీయకూడదు. కార్మికుల్ని నిరాయుధుల్ని చేసేటందుకు జరిపే ప్రతి ప్రయత్నాన్నీ అవసరంఅయితే బలప్రయోగం కూడా జరిపి

నిరోధించాలి. బూర్జువా డెమాక్రాట్లకి కార్మికులమీాద గల పలుకుబడిని విధ్వంసం చేయడమూ; అతివేగంగా, ప్రత్యేకంగా కార్మికులకి ఆయుధాలని ఇచ్చి శిక్షణని ఈయడమూ; బూర్జువా డెమాక్రాట్ల పరిపాలన కొద్దికాలం పాటయినా తప్పనిసరి గనక, ఆ వున్న నాలుగురోజులూ అది తమతో అనువర్తనగా ఉండకతప్పని పరిస్థితులు, భారతరపరిస్థితులు కల్పించడమూ; ఈ మూాడు ముఖ్య విషయాలనీ రాబోయే విప్లవసమయంలో కార్మికులూ, లీగూ కూడా మనస్సులో వుంచుకుతీరాలి.

మూాడోది :—నూతన ప్రభుత్వం స్థాపించబడిన వెంటనే పెట్టీ-బూర్జువాలు కార్మికులతోడి పోరాటాన్ని ఆరంభిస్తారు. పెట్టీ బూర్జువా డెమాకాట్లని కార్మికులు బలప్రయోగంతో ఎదురించగలగాలంటే, వారు స్వతంత్రంగా సంఘాలని ఏర్పాటు చేసుకోవడం అన్నింటికన్నా ముఖ్యమయిన విషయం. ఆ సంఘాలన్నింటినీ కేంద్ర సంఘంలోకి కూర్చాలి. ప్రస్తుత ప్రభుత్వాన్ని కూలదోసిన మరుసటి నిముషంలోనే లీగుయొక్క సెంట్రలు కమిటీ జర్మనీకి వస్తుంది. అది త్వరలోనే ఒక సమావేశాన్ని జరిపించి కార్మిక సంఘ కేంద్రాన్ని స్థాపించడానికి అవసరములయిన సూచనలని ఇస్తుంది. ఈ కేంద్ర సంఘమే ఉద్యమాన్ని నడిపిస్తుంది. 'కార్మికపక్షాన్ని అభివృద్ధిపరచడానికీ, బలపరచ

డానికి గల ప్రధానసూత్రాలలో ఒకటి ఏమిటంటే వివిధ రాష్ట్రాలలోని కార్మిక సంఘాలమధ్య అతి త్వరితంగా సంబంధాలు ఏర్పరచడమే. ప్రస్తుత ప్రభుత్వాన్ని కూల దోయడానికి ఫలితంగా వెంటనే జాతీయ ప్రతినిధి సభకి ఎన్నికలు జరుగుతాయి. ఆ సమయంలో శ్రామికులు ఈ క్రింది విషయాలలో జాగ్రత్త తీసుకోవాలి.

1. స్థానిక అధికారులుగాని, ప్రభుత్వ కార్య నిర్వాహకులుగాని, ఏవో మాయలూ, మర్మాలూ చేసి కార్మికులలో ఎక్కువమందికి వోటు లేకుండా చేస్తారు. అటువంటి ప్రయత్నాలని ఎంతమాత్రమూ సాగనీయ కూడదు.

2. కార్మికప్రతినిధులలో సాధ్యమైనంత ఎక్కువ మంది లీగు సభ్యులే అయివుండేటట్లు చూసుకోవాలి. పెట్టీ-బూర్జువా డెమాక్రాట్ల ప్రతినిధులకి పోటీగా ప్రతిచోటా కార్మికప్రతినిధులు నిలబడి తీరాలి. అవకాశం చిక్కిన సాధనా లన్నీ వుపయోగించి మన ప్రతినిధులే ఎన్నుకోబడేటట్లు చూడాలి. తమ ప్రత్యేకతని నిలుపుకోనడానికీ, ప్రజలందరికీ తమ విప్లవదృక్పథాన్నీ, పార్టీ కార్యవిధానాన్నీ, తెలుపుడు చేసేటందుకూ, తమ బలం ఎంతవరకూ వుందో పరీక్షించు కొనడానికీ, నెగ్గుతామనే ఆశలు లేశమాత్రం లేని ప్రదేశాలలో కూడా శ్రామికులు తమ ప్రతినిధుల్ని నిలువబెట్టాలి.

డెమాక్రాట్లు చెప్పే పెద్దపెద్ద కబుర్లకి మోసపోకుండా జాగ్రత్త పడాలి. ఉదాహరణకి, కార్మికుల యొక్క స్వతంత్ర కార్యాచరణం వలన డెమాక్రాటిక్ పార్టీలో చీలికలు కలిగి అభివృద్ధనిరోధకపక్షాల విజయానికి కారణం కలుగుతుందని వారు చెప్తారు. అటువంటి వాక్యాలని నమ్మి ఆచరణలో గనక పెడితే, పర్యవసానంలో కార్మికులు మోసపోతారు. ప్రతినిధిసభకి కొంతమంది అభివృద్ధి నిరోధకులు ఎన్నుకోబడడం వలన కలిగే నష్టంకన్న, కార్మికపక్షం స్వతంత్ర రూపంతో కార్యరంగంలోనికి దిగడం వలన కలిగే లాభం అధికమూ, ముఖ్యమూ కూడాను. కార్మికప్రజాతంత్రపక్షం మొదటినుంచీ దృఢనిశ్చయంతో, అభివృద్ధినిరోధకులకి భయోత్పాతం కలిగించే చర్యలతో కార్యరంగంలోకి దిగిందీ అంటే ఎన్నికలకి ముందుగానే వారి పలుకుబడి ధ్వంసం అయిపోతుంది.

బూర్జువా డెమాక్రాట్లకీ, కార్మికపక్షాలకీ మొట్టమొదట్లో జమీందారీ పద్ధతిని నిర్మూలించే సమస్యమీదనే పేచీ వస్తుంది. మొదటి ఫ్రెంచివిప్లవంలో మాదిరిగా పెట్టీ-బూర్జువాలు జమీందార్ల భూములన్నింటినీ రైతులకి ఉచితంగా ఇచ్చివేస్తారు. అంటే వ్యవసాయపు కూలీలు ఇది వరకు మాదిరిగా అదే దురవస్థలో ఉండిపోతారు. నేటి ఫ్రెంచి రైతుల మాదిరిగా దరిద్రంలోనూ, ఋణాలలోనూ

మునిగి తన్నుకొంటూ వుండే పెట్టీ-బూర్జువా వైతాంగం వుండడమే ఈ పార్టీ వారికి అభిమతం.

శ్రామికవర్గం కోసమై కార్మికులు ఈ విధానాన్ని ఎదిరించాలి. ఆక్రమించుకోబడిన జమీందారీ భూములు వ్యవసాయపుకూలీలకి వలసప్రదేశాలుగా వుపయోగించే టందులకై ప్రభుత్వవ్యవసాయక్షేత్రాలుగా మార్చబడాలని కార్మికులు కోరాలి. పెద్దతరహా వ్యవసాయం వలన కలిగే లాభాలన్నింటినీ ఆ ప్రదేశాలలో వ్యవసాయపుకూలీలు అనుభవిస్తారు. ఈలాగ మార్చడంవలన, ఇవి బలహీనం అయిపోతూన్న బూర్జువా ఆస్తిసాంప్రదాయశిథిలాల మధ్య నిలచి సమిష్టి ఆ సిద్ధాంతానికి ప్రచారం చేస్తూంటాయి. డెమాక్రాట్లు రైతులతో కలిసినట్లే, కార్మికులు వ్యవసాయపు కూలీలతో ఏకం కావాలి. తరవాత డెమాక్రాట్లు ఫెడరేటెడ్ రిపబ్లిక్కు యొక్క స్థాపనకోసం ప్రయత్నిస్తారు. లేదా, తమకి ప్రతిఘటన వుండదని తోచిందా, అవిభాజ్యమైన ఒకే ఒక రిపబ్లిక్కు యొక్క స్థాపనకి బదులు మ్యునిసిపాలిటీలకీ, రాష్ట్రాలకీ, సంపూర్ణస్వాతంత్ర్యం ఇప్పించి కేంద్రప్రభుత్వాన్ని నిర్వీర్యం చేయడానికి ప్రయత్నించుతారు. ఈ సూచనలని పూర్తిగా ఎదిరిస్తూ, కార్మికులు అవిభాజ్యమైన ఒకే ఒక జర్మను రిపబ్లిక్కు స్థాపించబడాలనీ, ఏవిధమైన మినహాయింపులూ లేకుండా అధికారాలన్నీ ప్రభుత్వం చేతిలో కే

వుండిపోవాలనీ విధించాలి. స్థానికసంస్థలకి స్వాతంత్ర్యమూ, స్వపరిపాలనాధికారమూ కావాలంటూ డెమాక్రాట్లు చెప్పే పెద్దకబుర్లకి వారు ఏమాత్రమూ మోసపోకూడదు. ఈ దేశంలో జమీందారీవిధానం తాలూకు శేషభాగాలెన్నింటినో నిర్మూలించవలసివుంది. ఎన్నో విధాలుగా స్థానికంగానూ రాష్ట్రీయంగానూ వ్యక్తులకి గల ప్రాముఖ్యతలు నశింపు చేయబడ వలసియున్నాయి. ఈ మాదిరిగా వున్న జర్మనీ వంటి దేశంలో ప్రతిగ్రామమూ, ప్రతిపట్టణమూ, రాష్ట్రమూ, విప్లవోద్యమానికి ప్రతిబంధకాలు కలిగించే పరిస్థితులు కలగనీయ కూడదు. కేంద్రానికి సంపూర్ణంగా అధికారాలన్నీ ఈయబడినప్పుడే విప్లవోద్యమం అభివృద్ధి పొందుతుంది. ఈనాటి పరిస్థితులే మళ్ళీ ఇంకోమారు తటస్థపడడమూ, మళ్ళీ ఈ యభివృద్ధికోసమే జర్మనులు ప్రతిగ్రామంలోనూ, పట్టణంలోనూ తిరిగి తిరిగి ఆరంభంనుంచీ పోరాటం సాగించ వలసిరావడమూ, ఏమాత్రమూ సహించతగిన విషయంకాదు.

నేటి ప్రత్యేక ఆస్తివిధానం కంటేనూ కూడా ఎక్కువగా అభివృద్ధిని నిరోధించే ఈ మునిసిపాలిటీల ఆస్తుల్ని శాశ్వతంగా అలాగే వుంచడం అసలే సరికాదు. ఈ ఆస్తులు అంతకంతకి క్షీణించిపోతూ, డబ్బుగల-డబ్బులేని మ్యునిసిపాలిటీల మధ్య నిరంతరం పేచీలు పెరగడానికి కారణం అవుతూన్నాయి. ఎప్పుడూకూడా కార్మికులకి బాధాకరంగానూ, అవమాన

కరంగానూ వుండే ఈ మునిసిపలు సివిలుచట్టాలని, ఏవో స్థానికసంస్థల స్వపరిపాలనాధికారం అనే పేరున శాశ్వతంగా కేంద్రప్రభుత్వముయొక్క సివిలుచట్టాలతో సమానంగా నిలిచివుండడాన్ని మనం అసలు సహించనైనా సహించ కూడదు.* 1793 లో ఫ్రాన్సులో చేసినట్లుగా చాలా పట్టుదలతో కేంద్రీకరణవిధానం సాగించడమే నిజమైన విప్లవ పక్షం నేడు చేయవలసిన పని.

---

* మార్క్సు యొక్క ఈ యభిప్రాయం పొరపాటని నేడు తెలుసుకోవాలి. అబద్ధాలు ఆడడంలో జంకూకొంకూలేని బోనపార్టీ అభిమానులైన చరిత్రకారుల ధర్మమాంలాని ఫ్రెంచి రాజ్యాంగాధికార కేంద్రీకరణం మహావిప్లవసమయంలో ఆరంభించబడిందనీ, దానిని ప్రజాపరిషత్తు రాజాభిమానులతోటీ, ఫెడరల్ విధానం కోరే అభివృద్ధినిరోధకులతోటీ, ఇతర బహిశ్కృత్రువులతోటీ పోరాడడంలో చాలా ముఖ్యమూ, బలీయమూనైన ఆయుధంగా ఉపయోగించుకొన్నదనీ, ప్రపంచం అంతా నమ్మింది. కాని, విప్లవం జరిగింది మొదలు బ్రూమైరు 18 వరకూ (ఫ్రెంచి విప్లవశకంలో రెండవనెల బ్రూమైరు, అక్టోబరు 22 మొదలు నవంబరు 20 వరకూ గలకాలం) గల మధ్య కాలంలో రాజ్యాంగశాఖలు, జిల్లాలు, మునిసిపాలిటీలు, ప్రజలచేత ఎన్నుకోబడిన అధికారులచేతనే నిర్వహించబడేవి. కేంద్రప్రభుత్వం యొక్క సాధారణచట్టాలకి లోబడి, వానికి పూర్తిస్వాతంత్ర్యం వుండేది. రాష్ట్రీయ, స్థానికప్రభుత్వాలు అమెరికాలో మాదిరిగానే ఫ్రాన్సులో కూడా విప్లవానికి మూలాధారాలుగా వుండేవి. అందు చేతనే నెపోలియను, బ్రూమైరు 18 న సింహాసనం ఆక్రమించినాక

రాబోయే విప్లవోద్యమంలో డెమాక్రాట్లు ఏవిధంగా అధికారంలోకి రాబోయేదీ, కొద్దో, గొప్పో సోషలిస్టు కార్యవిధానం సమర్థించక తప్పనియట్లుగా ఏవిధంగా ఒత్తిడికి లోనయ్యేదీ, మనము చూసేము. కార్మికులు వారికి పోటీగా ఉపపాదింపవలసిన విధానాలేమిటి ? అనే ప్రశ్న వస్తుంది, ఇప్పుడు. ఉద్యమప్రారంభంలో సహజంగా కార్మికులు కేవలమూ కమ్యూనిస్టు కార్యప్రణాళికనే ఉపపాదింపలేరు. అయినా వారు.

1. సాధ్యమైనంత అధికంగా ప్రస్తుతపు సాంఘిక విధానాన్ని అతిక్రమించేలాగ డెమాక్రాట్ల మీద ఒత్తిడి తెచ్చి, దానియొక్క క్రమాభివృద్ధిని అడ్డగించాలి. అడ్డగించి వాళ్ళని ఇరుకులో పెట్టాలి. ఉత్పత్తిసాధనాలని, రాకపోకల

---

ఆ ఎన్నికలపద్ధతిని తొలగించి ఉద్యోగులను తానే నియమించసాగేడు. ఆ పద్ధతే నేటికీ నడుస్తూంది. మొదటినుంచీ కూడా ఈ పద్ధతే అభివృద్ధినిరోధకులకి ప్రధానాయుధంగా ఉపయోగిస్తూంది. కాని, దక్షిణ జర్మనీలోని ఫెడరల్ రిపబ్లికన్లు 1849 లో కోరినది, ఇట్టి మాదిరిది కాదు; జాతీయరాజ్యాంగకేంద్రీకరణవిధానానికి ఏమాత్రం కూడా అభ్యంతరం కానిదిది. స్విట్జర్లండులో మాదిరిగా పాంతీయ, రాష్ట్రీయ ప్రత్యేకతల స్పర్శయైనా లేని స్థానికస్వాతంత్ర్యాన్నీ, రాష్ట్రీయస్వపరిపాలననే వారు జర్మనీలో ప్రవేశపెట్టాలని తలచేవారు.

(1885 లో 'జూరిచ్' నుంచి ప్రకటించిన ముద్రణలో ఏంగిల్సు చేర్చిన విషయ పీఠిక.)

సాధనాలని, కార్ఖానాలు, రైలురోడ్లు మొదలైన వాటిని, సాధ్యమైనన్ని ఎక్కువవాటిని ప్రభుత్వం చేతుల్లోకి వచ్చేటట్లు చేయాలి.

2. డెమాక్రాట్ల ప్రతిపాదనలు ఏవీ సంస్కరణ విధానంలో వుంటాయే గాని, విప్లవకరంగా వుండవు. అటువంటి ఆ ప్రతిపాదనలని తీవ్రతరంచేస్తూ వానిని, వ్యక్తి గత ఆస్తివిధానం మీాదనే దెబ్బతీసేటట్లుగా తయారు చేయాలి. ఉదాహరణకి : బూర్జువావర్గం ఫ్యాక్టరీలనీ, రైలురోడ్లనీ కొనివేయాలంటుంది అనుకోండి. అప్పుడు ఆ రైలురోడ్లూ, ఫ్యాక్టరీలూ అభివృద్ధి నిరోధకుల ఆస్తులు కావడం మూలాన ఏ విధమైన ప్రతిఫలం ముట్టచెప్పకుండానే ప్రభుత్వం స్వాధీనం చేసుకోవాలని కార్మికులు విధించాలి. ఆస్తులను బట్టి పన్నులు వేస్తామని డెమాక్రాట్లు అంటే ఆదాయాన్నిబట్టి పన్నులు వేయాలని కార్మికులు ఉపపాదన తేవాలి. ఒకవేళ వారే తమంత తాముగా నామమాత్రంగా ఆదాయపుపన్ను వేయడానికి సిద్ధం అయితే, పెద్దపెద్ద పెట్టుబడులు త్రాసునాసయిపోయే టంతవిపరీతంగా ఆదాయపు పన్నులు వేయమంటూ కార్మికులు పోరాడాలి. డెమాక్రాట్లు ప్రభుత్వపు ఋణాల్ని చట్టబద్ధం చేయాలంటూ కోరుతే, ఋణాలు సర్వమూ రద్దు చేయబడవలసిందే (ప్రభుత్వపు దివాలా) నని కూలీలు ఒత్తిడి తేవాలి. అందు

కారల్ మార్క్స

చేత అన్ని చోట్లా కూలీలు ప్రతిపాదించవలసిన కోరికలు డెమాక్రాట్లు సూచించే కార్యప్రణాళిక మీదా, సౌకర్యాల మీదా, ఆధారపడి వుంటాయి.

ఇప్పుడు జర్మను కార్మికులు అధికారంలోకి వచ్చి, తమ వర్గప్రయోజనాలని సాధించలేకపోయినా ఫ్రాన్సులోని తమ వర్గం విజయం పొందుతుంది. ఆ విజయంతోటే ఇక్కడ కూడా విప్లవనాటకంలో ప్రథమాంకం ఆరంభం అవుతుంది. ఆ విజయముయొక్క ప్రోత్సాహాన్ని పొందుతుంది, యిది.

కాని, ఈలోపుగా వారు తమ వర్గప్రయోజనాలని అనుసరించి చైతన్యం సంపాదించాలి, సాధ్యమైనంత త్వరలో స్వతంత్రంగా పార్టీ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకోవాలి. కార్మికపక్షానికి స్వతంత్రంగా పార్టీ వుండవలసిన అగత్యత విషయంలో డెమాక్రాట్ల మోసపుశబ్దజాలానికి లొంగిపోకుండా వుండాలి. వారు తమ అంతిమవిజయాన్ని తమంత తామే సంపాదించుకోవాలి. 'శాశ్వత విప్లవం' అన్నదే వారి యుద్ధనినాదం కావాలి!

లండన్,

మార్చి 1850